Regd No. N. 45 / M 3813

103567

వెల ఒక అణా



# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక



సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర ఆషాఢ శు॥ ౬ (౨౫-౯-౧౩౫౦ ఫ.) సోమవారము సంచిక ౧౭

# రష్యాజర్మనీయుద్ధరంగము

## మహాసంకుల సమరము

## రష్యాభాగపు పోలండును జర్మనులుజయించుట

## ౫౦ లక్షలసైన్యము ౧౦ వేలవిమానాలు ఉభయపక్షములలో యుద్ధముచేయుచున్నవి

## జర్మనులకును గొప్పనష్టములు

## బెల్గ్రేడు ఖాళీ యయినది

## లెనిన్‌గ్రాడ్ తగులబడినది

రష్యాజర్మనీదేశాలకుజరుగుచున్న మహాయుద్ధము చాలతీవ్రరూపముదాల్చినది. ఉభయులునుగొప్పపట్టుదలతో పోరాడుచున్నారు. జర్మనులకుచాలానష్టములుకలిగినను ముందుకు పోవుచున్నారు.

ఈడన్ ప్రసంగము

జర్మనీరష్యాపై యుద్ధప్రకటనచేసినసందర్భమును పురస్కరించుకొని బ్రిటిషువిదేశాంగమంత్రియయిన యీడనుగారు పార్లమెంటులో ౨౪ జూను నాడు మహోపన్యాసముగావించిరి. రష్యావారు ఆర్థికసైన్యసహాయాన్ని కోరిరనియు అట్లుచేయుటకు బ్రిటిషుప్రభుత్వంవారు ఒప్పుకొనిరనియు ప్రకటించుచు నీక్రిందివిధంగా మాటాడిరి.

"మనమందరమును హిట్లరు విధ్వంసమునేము ఖ్య లక్ష్యముగా నుంచుకొనవలెను. హిట్లరు ప్రపంచమునంతా వశపరచుకొనుటలో బ్రిటిషుసామ్రాజ్యమడ్డుపడుచున్నది. అందుచేహిట్లరునకు బ్రిటిషుసామ్రాజ్యముపై ముఖ్యలక్ష్యమున్నదని మాకు తెలియును. మనదేశము దండెత్తివచ్చుటకుముందు రష్యాను ధ్వంసముచేసి అక్కడనుండి తనకు సాయంలేకుండా రక్షించుకోతలచినాడు.

రష్యాయొక్కయు బ్రిటిషువారియొక్కయు సిద్ధాంతములు పరస్పరవిరుద్ధములుకాని యింతమాత్రముచేతమనంరష్యాకుసహాయంచేయకుండా యుండజాలము. హిట్లరు విశ్వాసఘాతుకుడుగా రష్యాకు ద్రోహముచేసినాడు. పైగా బ్రిటిషువారికిని రష్యావారికిని ఏదో రహస్యసమాధానముండెనని యబద్ధములాడినాడు. ఇంతవరకురష్యాలోనుండిన క్రిప్సుగారు మనకురష్యాపైన సద్భావమున్నదని వారికినచ్చచెప్పినందుకు వారియెడ మనము కృతజ్ఞత తెలుపుకొనుచున్నాము. హిట్లరు రష్యాపై ప్రకటించినయుద్ధంవలన ఆతడుసర్వద్రోహియని మరొకమారు వ్యక్తపరచుకొన్నాడు.

రూజ్వెల్టువాగ్దానము

అమెరికాఅధ్యక్షులగు రూజ్వెల్టుగారురష్యాకు అన్నివిధాలసహాయంచేయుదుమని వాగ్దానముచేసినారు. రష్యాకుతూర్పుభాగమున అనగా ఏషియాఖండముయొక్క తూర్పుహద్దులో అమెరికాఖండముయొక్క పశ్చిమహద్దు కలియుచున్నది. రష్యాకు తూర్పున ఉత్తరధ్రువ సముద్రములో ఓడరేవుగానున్నట్టి "వ్లాడివాస్టక్"అనురేవుద్వారా అమెరికనుఓడలలో రష్యాకుకావలసినయుద్ధసామగ్రిని సప్లయిచేయుదుమని వాగ్దానము చేసినారు. ఆప్రాంతములందు జపానురాజ్యముండుటచేత జపానువారు అమెరికానుండి రష్యాకు సామానురానివ్వకూడదని జపానుపత్రికలుకొన్ని ప్రచారముచేయుచున్నవి.

రష్యాహద్దులు

రష్యా జర్మనీయుద్ధము సరిగా గ్రాహ్యమగుటకుగాను రష్యాయొక్క స్థితిని గ్రహించవలసియుండును. రష్యాకు పశ్చిమములో లిథుయేనియా, ఎస్టోనియా, లట్వియా, ఫిన్లాండుఅను చిన్నచిన్న రాజ్యాలున్నవి. వీటినికూడగతసంవత్సరమందే రష్యాతనవశముచేసుకొనియుండెను. అందుచేతయీ నాల్గింటిసానుభూతి సహజముగా జర్మనీపక్షముగనుండును. రష్యాకుపశ్చిమమున పోలెండుదేశమున్నది. దీనిలోసగముభాగమును రష్యాయుద్ధాదిలోనే లాగుకొనియుండెను. పోలెండుకుఉత్తరంలోనురష్యాకు పశ్చిమమందును జర్మనీరాజ్య భాగమయిన తూర్పుప్రష్యామండలమున్నది. పోలెండు దక్షిణముగాను రష్యాకుపశ్చిమంలోను హంగరీదేశమున్నది. హంగరీజర్మనీతో చేరిపోయినది. దానికిదక్షిణములో జకోస్లావేకియా యున్నది. ఆదియురష్యాకుపడమటిసరిహద్దులోనున్నదిదానిని యుద్ధానికిపూర్వమే జర్మనీయాక్రమించియుండెను. రష్యాకుదక్షిణములో రొమేనియాదేశమున్నది. ఈరొమేనియాజర్మనీ పక్షంగాచేరియున్నది. రొమేనియాను ఉత్తరభాగంలోని బెసరేబియామండలాన్ని రష్యాలాగుకొనియుండెను. ఈ బెసరేబియాకు ఉత్తరములో రష్యావారియుక్రేను మండలమున్నది. ఈయుక్రేనుమండలము చాలా సారవంతమయినది. మొత్తంయూరోపుఖండములో నింతటిసారముగలమండలము మరొకటిలేదు. అందుచేతజర్మనీవారు దానినివశపరచుకుంటే యికవారికితిండికికరువుండదు, ఈదుద్దేశము జర్మనీకిచిరకాలంనుండి యున్నది- యుక్రేనుకుతూర్పులోను ఇరాకుకుఉత్తరములోను రష్యాకుదక్షిణములోను 'బాకూ' అనురష్యావారి పట్టణమున్నది- అచ్చటగొప్పకిర్సనాయిలు బావులున్నవి- వీటినిజర్మనీపట్టుకొన్నచో వారివిమానాలకు, మోటార్లకు, టాంకులకుయిబ్బంది లేకుండాపెట్రోలు సప్లయిఅగునుఅందుచేతజర్మనీవారు దానిని వశపరచుకొనుప్రయత్నంచేయవచ్చును. రుమేనియాప్రక్కన నల్లసముద్రమున్నది- దానిలోరష్యారు మేనియాలరేవులున్నవి- ఇవియూరోపుఖండమందలి రష్యాసరిహద్దులు. కానిరష్యాచిన్నదేశముకాదు- అంతటిగొప్పదేశము ప్రపంచమున వేరొకటిలేదు- పశ్చిమంలోజర్మనీవద్ద రష్యాసరిహద్దు ప్రారంభమయితే తూర్పులోఏషియాఖండములోని జపానువద్దరష్యాయొక్క తూర్పుసరిహద్దు అంతమగుచున్నది- పడమటనుండి తూర్పుకురష్యాలో రైలుప్రయాణంచేస్తే ౧౪దినాలుపడుతుంది. ఏషియాఖండములో రష్యాకుదక్షిణమున ఇరాన్, అఫ్ఘనిస్థాన్, హిందుస్థాన్, చీనాదేశాలున్నవి తూర్పునకొరియా, జపానుదేశాలున్నవి రష్యాకుముఖ్యపట్టణము పూర్వము లోమాస్కో-అనునగరముండెను. అదిపోలెండుసరిహద్దునుండిసుమారు ౪౦౦మైళ్ళదూరములో నున్నది. సుమారు ౩౫౦ మైళ్ల నుండి 'లెనిన్‌గ్రాడ్' అనునగరము రష్యాకు ముఖ్యపట్టణమైయున్నది. ఆపట్టణము ఫిన్లాండు సరిహద్దు సమీపములోనున్నది. ఈభూగోళపటమును చూచిగ్రహించుటచాలఅవసరము

౨౪ జూనునాటి యుద్ధము

రష్యావారు రొమేనియావారి 'కాన్‌స్టన్జా' అను నల్లసముద్రపురేవుపై మూమ్మారు దండయాత్రలుచేసి బాంబులనువేసినారు, జర్మనులు యుక్రేనులోని ముఖ్యపట్టణమయిన కీవుపట్టణముమీద బాంబులువేసినారు. పోలండు సరిహద్దులో రష్యావారియొక్క తెల్లరష్యాఅనుపేరుగల మండలమున్నది. దానియొక్క ముఖ్యపట్టణముపేరు 'మిన్‌స్కు' దానిపైనను జర్మనులు బాంబులనువేసినారు. లట్వియా దేశము రష్యా వశములోనున్నది. అచ్చట లిబో, రీగాఅనురేవులున్నవి- వాటిపైకూడ జర్మనువారు బాంబులనువేసినారు. లిథుయేనియా ప్రాంతంలో జర్మనీ రష్యాసైన్యదళాలకు తీవ్రసంఘర్షణజరిగెను. అందొక జర్మనీదళము ధ్వంసముచేయబడెను. రష్యాసైన్యముబలముగా ప్రతిఘటించుచున్నదని జర్మనువారొప్పుకొనుచున్నారు.

జర్మను నావలు బాల్టిక్ సముద్రంలోను నల్లసముద్రంలోను రష్యాఓడలపైన దాడిచేసినవి. ఒక రష్యానావముంచబడినది. ఫిన్లాండువారికిని రష్యావారికిని మనస్తాపములు హెచ్చుచున్నవి.

స్వీడను దేశము

ఫిన్లాండుకు పడమట నార్వేకు తూర్పున స్వీడను దేశమున్నది. నార్వేనుండి జర్మను తమసైన్యాన్ని స్వీడనుమీదుగా ఫిన్లాండుకుచేర్చి యచ్చటనుండి రష్యామీదికి పంపవలెనని యేర్పాటుచేసుకొనుచున్నారు. స్వీడను తటస్థదేశముగనున్నను, జర్మనుసైన్యమును స్వీడనుమీదుగా తీసుకొనిపోవుటకంగీకరించవలెనని జర్మనువారు బెదిరించినారు. అందుకు స్వీడనువారు విధిలేక యొప్పుకొనవలసివచ్చినది. జర్మనువారు తమసైన్యాన్ని స్వీడనుమీదుగా తీసుకొనిపోయినారు.

ఫిన్లాండు యుద్ధముప్రకటించుట

ఇదివరలో ఫిన్లాండువారు తాముయుద్ధమునచేరలేదనియు తమకు రష్యాతో యుద్ధములేదనిచెప్పియుండిరి, కాని గతబుధవారం మధ్యరాత్రివారు రష్యాపై లటాలునయుద్ధముప్రకటించిరి, తాములేకున్నను రష్యావారు తమపట్టణాలపై బాంబులనువేసినందున ఆత్మరక్షణార్థమై యుద్ధంప్రకటించవలసివచ్చెనని ఫిన్లాండువారు ప్రకటించినారు. దాని ముఖ్య పట్టణమయిన 'హెల్సింకీ'పైన రష్యావిమానములు దాడిజేసినందున వాటిలోని౨౦విమానాలను ఫిన్లాండువారుపడగొట్టినారు. జర్మనువారు రష్యాసరిహద్దుపైకిచొరబడిపోయిరి లెనిన్‌గ్రాడు ముఖ్యపట్టణముపై బాంబులువేసినారు. పోలెండుదక్షిణభాగములో 'ల్వోవ్'నగరమువద్దగర ఉభయసేనలకు గొప్పసంఘర్షణజరిగినది. బెసరేబియా రొమేనియనుసేనను ముందుకురానీకుండా రష్యావారు పంచిప్రతిఘటనను జేసినారు.

హిట్లరు యుద్ధరంగమునకు వెళ్ళుట

౨౫జూనునాడు హిట్లరు జర్మనీవదలి రష్యాసరిహద్దులోజరుగు యుద్ధరంగమునకు స్వయముగా వెళ్లి యుద్ధపరిశీలనచేయుచున్నాడు- లిథుయేనియాలోని పెద్దపట్టణమయిన విల్నానగరమును జర్మనుసేనలుపట్టుకొన్నవి. లిథుయేనియాసైన్యము జర్మనులకు మంచిసహాయము జేయుచున్నది. రష్యావారు జర్మనుసైన్యమును నిరోధించుటకుగాను రెండుపెద్దవారధులను ధ్వంసముజేయప్రయత్నమునమండగా వారినట్లు జేయనీయకుండునట్లు నిరోధించిరి. లెనిన్‌గ్రాడులో జర్మనువిమానాలు అగ్నిబాంబులనువేసినందున నగరములోనిచాలాభాగములు అగ్నికిఆహుతియయిపోయినవి జర్మనువారివార్తప్రకారము వారురష్యావారిని వెనుకకునెట్టుకొనుచు ముందుకుసాగుచున్నారు. ఒకచోట జర్మనువారివిమానదళము రష్యావారియొక్క ౧౧౦టాంకులనునాశముజేసినది. మరొకచోట రష్యావారిజ-ఉబండ్లు సేనతోగూడపోవుచుండగా వాటినిజర్మనులుబాంబులువేసి ధ్వంసముజేసినారు.

ఆటువలక్షణములో రొమేనియాపైన రష్యావారుబాగా దెబ్బతీయుచున్నట్లు ౪౦౦రుమేనియాటాంకులను నాశనముజేసినట్లు ఆట్టివిమానపుదాడిలో రష్యావారి౫౦విమానములు నశించినట్లు రష్యావారు ప్రకటించినారు.

బలాబలములు

రష్యాకు జర్మనీవారివద్ద నుండు విమానముల సంఖ్యలో మూడొవంతు విమానములున్నవనియంచనావేయబడుచున్నది. కాని జర్మనీవారి టాంకులకంటె రెండంతల టాంకులు రష్యావారికున్నవట, ఇపుడు యుద్ధములో రష్యావారు ౪౦౦౧విమానాలనుజర్మనువారు ౬౦౦౦విమానాలను ఉపయోగించుచున్నారు. ఇంకా సైన్యసంఖ్య ఉభయవర్గాలవారిది కలిసి ౫౦లక్షలున్నదనియు, ఉభయసైన్యములబలము సమముగానున్నదనిచెప్పుచున్నారు. జర్మను ౧౭౬ డివిజన్లసైన్యమును రష్యాపై ప్రయోగించుచున్నారు.

రష్యావారు ౧౬౫ డివిజన్లసైన్యమునుజర్మనీపై ప్రయోగించుచున్నారు. ఒక్కొక్క డివిజనులో ౧౫వేలసైన్యమున్నది, అనగా జర్మనీవారు యించుమించు ౨౫లక్షలసైన్యమునున్ను, రష్యావారదేవిధముగా యించుమించు ౨౫లక్షలసైన్యమును యుద్ధములో వినియోగించుచున్నారు- ప్రపంచచరిత్రలో నేటివరకు నింతటి గొప్పసైన్యముతో యుద్ధముజరిగియుండలేదు. జర్మను సైన్యములో ౧౩౦ జర్మను డివిజన్లున్ను ౨౦ రొమేనియావిన్ని ౧ ఫిన్లాండుడివిజన్లున్ను కలవని చెప్పుచున్నారు.

ఇటలీ సహాయము

రాజగాయణములో పిడుకలవేటవలె యిటలీ నియంతయగు ముసోలిని "నాకును రష్యా శత్రువే"యనిప్రకటించి తనసైన్యమును రష్యారంగములోనికి పంపుచున్నాడు.

రష్యారంగమునకుపోవు సైన్యమును, ఆతడు స్వయముగా తనిఖీచేసి సైన్యమునకు ధైర్యముగఱపి రవాణాచేసికొనెను.

రష్యాలో జర్మనుసైన్య ప్రవేశము

జర్మనీవారు యీ౫దినాలలో రష్యావారాక్రమించుకొనిన పోలండుభాగమునుండి రష్యావారిని వెనుకకునెట్టుచువచ్చినారు. ౨౬జూనునాడు రష్యావారాక్రమించుకొనిన పోలెండుభాగమును పూర్తిగావశపరుచుకొని అసలు రష్యాదేశములో జొరబడినారు. తెల్లరష్యాపట్టణమునకు ముఖ్యపట్టణమయిన "మిన్స్కు" పట్టణమును ముట్టడివేసిరి దక్షిణములో యుక్రేను ముఖ్యపట్టణమగు 'కీవు'నుసమీపించినారు. అటుయింకా దక్షిణములో రష్యావారు రొమేనియాదేశముపై తీవ్రమయినవిమానదాడులు చేసిరి. అందువల్ల రొమేనియావారు తమముఖ్యపట్టణమయినబుకారెస్టును, ఖాళీచేసిరి. ఆటుఉత్తరంలో లాట్వియా ముఖ్యపట్టణమయిన రీగా పట్టణమును జర్మనువారాక్రమించుకొనిరి. రుమేనియాలోని 'ప్లోయెస్టి' అనుస్థలములో నూనెస్టోరులపై బాంబులువేసిరష్యావారు నాశనముచేసినారు, కొందరుజర్మనీసైనికులకు రష్యావేషలదుస్తులువేసి రష్యనుసేనలవెనుకభాగములో గొడుగులద్వారా దింపినారుకాని రష్యావారు దానినిగుర్తించి వారిని ధ్వంసముచేసిరి. బాల్టిక్ సముద్రంలో రెండు జర్మను నావలను రష్యావారుముంచినారు.

ఇవి యింతవరకు తెలిన రష్యాజర్మనుల యుద్ధవివరములు.

ఇంగ్లీషువారి విజృంభణ

ఇంగ్లీషువారు అబిసీనియా ప్రాంతమందలి 'జిమ్మా' పట్టణమునుపట్టుకొన్నారు. చాలామంది యిటలీసేనానులను ఖైదీలుగాపట్టుకొనిరి. సిరియారంగములో డెమాస్కసును పట్టుకొనియుండుకుసాగుచున్నారు. ఫ్రెంచిసైన్యమంతటను ఓడుచున్నది. సిరియాలోని బేరూటురేవుపై యింగ్లీషువారు బాంబులువేసినారు. ఫ్రాన్సుదేశములో ఇంగ్లీషువిమానాలు విజృంభించియున్నవి, చాలాప్రదేశాలపై బాంబులువేయబడినవి. సిరియాలోఫ్రెంచివారి ౨౦వేలసైన్యము సిరియాను వదలి పారిపోవుచున్నది, ఇంగ్లీషువిమానాలు విజృంభించియున్నవి! చాలాప్రదేశాలపైబాంబులువేయబడినవి, సిరియాలోఫ్రెంచివారి౨౦వేలసైన్యము సిరియానువదలి పారిపోవుచున్నది. ఇంగ్లీషువిమానాలు జర్మనువారికిలంకాలవదగ్గర బ్రెస్టనురేవుపైబాంబులువేసి చాలనష్టము కల్గించినవి- ఈవారంలో ఇంగ్లీషువారు జర్మనువారి ౧౦౭విమానాలను పడగొట్టినారు. ఇంగ్లీషువారివి ౧౭ మాత్రమే నష్టమయినవి. ఐర్లెండుదేశములో జర్మనువారి పోద్బలంచేత కొందరు ఐరిషువారు యింగ్లీషురాయబారి కచ్చేరిపై రాళ్లురువ్వి నష్టముకలుగచేసిరి. ఐరిషు ప్రభుత్వమువారు నష్టపరిహారమిచ్చుటకై యంగీకరించినారు

## బానిసను యజమాని సహాయమడుగుట

## ముందుమాదాస్యాన్ని తొలగించండి

ఇంగ్లీషుస్త్రీలకు భారతీయ స్త్రీలప్రత్యుత్తరము

కొన్నిదినాలక్రిందట కొందరు ఇంగ్లాండుదేశ స్త్రీలు భారతీయ స్త్రీలు యుద్ధసహాయమును బాగాచేయవలెనని ఒకపత్రికా ప్రకటనముచేసియుండిరి. దానికిప్రత్యుత్తరముగా భారతీయ స్త్రీలసంఘాలప్రతినిధులైన శ్రీమతులు సరోజినీనాయుడు, రామేశ్వరీనెహ్రూ, విజయలక్ష్మి పండిత్ రాణీలక్ష్మిబాయి రాజవాడి, రాధాబాయి సుబ్బరాయన్, అమ్మూస్వామినాధన్, రాజకుమారి అమృతకువర్ గారలు ఈవిధముగా పత్రికా ప్రకటనచేసినారు.

ఇప్పుడుమేము వ్రాస్తున్న యీలేఖలో కేవలం మా అభిప్రాయాలేకాకుండా ౧౫ ఏండ్లనుండి యీదేశంలో ప్రసిద్ధిపొందిన మాఅఖిలభారత మహిళామహాసభవారి ఆశయాలను కూడా కలిపినాము.

మీరిదివరలో మాదేశ స్త్రీలకుపంపిన విజ్ఞప్తిలో మీరువ్రాసినవ్రాతలు చాలానిష్కపటంగా నేయున్నవి.

కానియదార్థవిషయపరిజ్ఞానం మీవ్రాతలలో శూన్యము గానున్నది. బ్రిటిషుప్రధానిమాత్రం భారతదేశవిషయంలో బ్రిటిషువారికిగల ఆశయాలను సుస్పష్టంగావ్యక్తీకరించుచునేయున్నారు. ఈదేశమునజీవంగాఉన్నంతకాలం దీనితోతాము దాస్యంచేయించుకోవాలని బ్రిటిషువారిఅభిలాషగా కనబడుచున్నది. ఇప్పుడుజరుగుచున్న యీమహాయుద్ధంలో భారతదేశంగూడా తలదూర్చవలెననీ, అట్టిదానికైభారతదేశంయొక్క ఉద్దేశాలనుకూడా తీసుకోవలసినఅవసరంలేదనీ బ్రిటిషువారుతలచుచున్నారు భారతదేశాక్రమణకొరకు తాము ఏర్పాటుచేసికొనినసేన యిప్పుడుయుద్ధరంగంలో విహారంచేయుచున్నది. ఈభారతీయసైన్యం ధైర్యస్థైర్యాలలో బాగాపోరాడుచున్నదని మాత్రం బ్రిటిషుమంత్రికొనియాడుచున్నాడు. ఈభారతసైనికులకు స్వదేశజాతీయోద్యమములతో మాత్రం యేమీజోక్యంలేదు. ఈయుద్ధవాహినికి కావలసినధనముకూడా యీదేశమునుండియే వసూలుచేయుచున్నారు. బలవంతంగా వసూలుజేయుచున్నప్పటికీ ప్రజలుతమంతటతామేయిచ్చిన ద్రవ్యమని అధికారులుప్రకటించుచున్నారు. ఇదేగాక పన్నులద్వారాగూడాబలవంతంగా వసూలుచేయుచున్నారు. బ్రిటిషువారు భారతదేశమునుబలవంతంగాను, బెదిరింపులతోనుఅణచి యీదేశంనుంచి సహాయంపొందుచున్నారు. ఇన్నిపరిస్థితులు యీవిధంగా దినాభివృద్ధిగాఉంటే వీటిని మీరేమాత్రం పరిగ్రహించుటలేదు.

రూజ్వెల్టుప్రసిడెంటుగారు చెప్పినదానిని మీరు అన్యధాఅర్థంచేసుకొన్నారు. రూజ్వెల్టుగారు చెప్పినదేమంటే, "బానిసతనాన్ని విధించేదేశాలున్ను ప్రజాస్వాతంత్ర్యమునభిలషించే దేశాలున్ను ముఖాముఖిగాపోరాడుచున్నవి." అనివారన్నారు, అయితేరూజ్వెల్టుగారుచెప్పిన లక్షణాలలో యీదేశంజేరుటకువీలులేదు. ఎందుకనగా, ఆసియాఖండవనివాసులకు స్వాతంత్ర్యమేలేదు. అందులో భారతదేశానికసలేలేదు. ఇదేకాకుండా ఆఫ్రికాఖండంగూడాదీనికేసరిపోవుచుండి కాబట్టియీమహాయుద్ధము బ్రిటిషు సామ్రాజ్యాధిపతులకూ, జర్మనునాజీలకూసంబంధించినదైయున్నది. ఈయుద్ధంలోఎవరుగెలిచినను యూరపుజాతికంటె విభిన్నములయినజాతులను పిప్పిచేయుటకుసంకల్పించినారు కనుకమాకునాజీతత్వంగాని, ఫాసిస్టువిధానంగాని బ్రిటిషువారిసామ్రాజ్యవాదంగాని సమ్మోదకరములుకావు, మేముహింసను, అసత్యమునసహించువారలము. మాకు యుద్ధమనినగిట్టదు. మీరెంతేకాకూ, బ్రిటిషు వనితలు మహాత్యాగంజేస్తున్నారని ప్రశంసించుచున్నారే గానిదానివల్లకూండేఅనర్థాలను మీమీపురుషులకు నచ్చచెప్పినట్లయితే చాలా బాగుంటుంది. కానిదానికిమారుగా మీరున్నూ మీపురుషులమార్గాన్నే అనుసరించి యీ ప్రళయనర్తనంలో భాగస్వాములగుచున్నారు.

దాస్యశృంఖలాలలోపడియున్న భారతదేశాన్ని శృంఖలాధిపతులగు బ్రిటిషువారికి సహాయంచేయవలసినదని మీరుచేసేప్రకటనచూస్తే చాలా విస్మయంకలుగుచున్నది, కనుకయీబానిసలకధికారంవహించిన బ్రిటిషువారుముందుగా యీదాస్యశృంఖలాలనుండి యీబానిసలనువిడిచి తాముచేసినపాపానికి పరిహారంచెప్పుకొన్నట్లయితే అప్పుడు బ్రిటిషువారిధర్మబుద్ధికి నిదర్శనంకనబడుతుంది– మీరుమాకునిష్కపటంగా విన్నవించినారు కాబట్టి మేమున్నూ నిష్కల్మషంగానే యీ సమాధానమిచ్చినాము."

## శ్రీపతి రంగప్పగారి కిచ్చిన అభినందన పత్రము

మహిళాసభాధ్యక్షిణీ!

నలువదిలక్షల నిజాంరాష్ట్ర ఆంధ్రస్త్రీలకు మీరు మకుటంలేనిమహారాణులు. మీకుమాహృదయపూర్వక అభినందనములు. ఆంధ్రఆంగ్లేయ ఉర్దూభాషల్లో మీకున్నప్రావీణ్యంమీసోదరీలోకమును విజ్ఞానపథమునకు దీసుకవెళ్లుటకే ఉపయోగించగలరని మా ఆశ.

ప్రాయమువచ్చిననాటినుంచి మీరు చేయుచున్న సంఘసేవ సర్వజనవిదితమే. సకలవిసయముల సామర్థ్యమున్నమీరు, ఈ అధ్యక్షస్థానమునుంచి అసంఘసేవచేయుటయే ప్రధానాశయముగా పెట్టుకుంటారని నమ్ముతున్నాము, యుగయుగములనాటి మనఆంధ్రవీర నారీమణులరక్తంమీలో ప్రవహించుచున్నది. వీరరుద్రమ శౌర్యోత్సాహము, నాయకురాలికౌశల్యనైపుణ్యము, మల్లమాంబకళ్యాగశక్తి అలవరుచుకొని కార్యరంగములోదుమికి, మహిళాభ్యుదయానికి పాటుపడుటయే మీజీవితోద్దేశ్యముగాభావించ కోరుచున్నాము. ఇవి విలాసాలతోను, ఉపన్యాసాలతోను, పొద్దులుపుచ్చేరోజులుకావు. నుసదరిద్రదేశములో అక్షలకొలది స్త్రీలు కడుపుకుచాలినతిండిలేక, మనుష్యులకు తగినప్రపంచజ్ఞానంలేక, జీవించటానికితగినంతఆరోగ్యములేక అల్లాడిపోతున్నారు. వారికిసరియైనదోవచూపడమే మీ ముఖ్యకార్యక్రమంగా పెట్టుకుంటారని ఆశించుచున్నాము. మాసుండలి అధ్యక్షురాలికి ఈగౌరవంలభించుటకు ఇది రెండవసారి మండలి మీఅధ్యక్షతలో తనస్థిరత్వాన్ని లుప్రకోవలెననికోరుచున్నది, ఒకశాశ్వతనివాసమునకు మందిరమునిర్మింపజేసి, స్థిరమైనఆర్థికవసతిని ఏర్పరచటమే మీసేవాపరమావధిగా సర్వయింపకొంటురనిభావించుచూ మాసవసాద మిమ్ములను అభినందించుచున్నాము.

ఆంధ్రయువతీ మండలి సభ్యురాండ్రు

## దీర్ఘవ్యాధులు

త్వరలో చంపవుగాని ఇంగ్లీషుమందులకు ఇంజక్షనులకుకుదురవు ఎంతకాలమునకు కుదిరినప్పటికి ఆయుర్వేదమందులేకుదర్చవలెనుగాని మరొకమందులుకుదర్చలేవు. మాఇంట్లోవారికి ౯ ౧౦ సంవత్సరములనుంచివున్న దీర్ఘరోగములకుకొన్నివేలరూపాయిలు ఖర్చుపర్చితిని. తాత్కాలిక గుణమేగాని పూర్తిగాకుదరలేదు. ఆయుర్వేదశాస్త్రజ్ఞులు, మంచి అనుభవజ్ఞులు, అనేకవేలమందికి చికిత్సచేసి గొప్పప్రఖ్యాతినిబొందినవృద్ధవైద్యులు హైదరాబాదు—ములకపేటలో 252 బి. క్లాకు బిల్డింగులోవున్న డాక్టర్ రత్నం అండ్ సన్సు మెడికల్ హాల్ వద్దనుంచి మందులుతెప్పించి వారిసత్యంప్రకారం చాలాకాలంనుంచి వారిమందు లేవాడుచున్నాము. మాఇంట్లోఅందరం సంపూర్ణఆరోగ్యవంతులమైతిమి. ఎంతకఠినమైన దీర్ఘవ్యాధులైనప్పటికి క్షయ, ఉబ్బసం, పక్షవాతం, కీళ్లవాతం, తిమ్మెర్లు, మచ్చలు, పిచ్చికుక్క, బొల్లి, భగంద్రం, స్త్రీలవ్యాధులు, గొడ్డాలితనం, చంటిపిల్లలవ్యాధులు, నపుంసకత్వం, అజీర్ణశూల. మధుమేహంవగైరా అసాధ్యపురోగములన్నియు సంపూర్ణముగకుదర్చగలరు. గాని వారిమందులకు పత్యముచేయవలసియుండును. పత్యముసరిగాచేసేవారికిక్షంతకంటెనమ్మకమైనవి మరొకమందులుండవని నాఅనుభవములో గ్యారంటీగాచెప్పగలను.

ఇట్లు,

జేబుళం యెల్లారెడ్డి,

ల్యాండ్ లార్డు [భూస్వామి],

కడప, 2-6-1941.

## కావలెను

మెట్రిక్యులేషన్ పరీక్షకు ప్రైవేటుగా చదివి హైదరాబాదునగరములో జరుగుపరీక్షలకు కూర్చొనువారు కావలెను, ఆడవారు మగవారుకూడ తయారుచేయబడుదురు. చదువు యిచ్చుటకు వచ్చిగాని, పోస్టుద్వారాగాని చదువుకొనవచ్చును. ఇచ్చటకువచ్చి నేర్చుకొనువారికి భోజనగృహ వసతులుగలవు ఈనెలాఖరునకే జేర్చుకొనబడుదురు. నేర్చుకొనదలచినవారు జేర్చుకొనబడునం దున వెంటనే జేరవలెను. ఇచ్చటకువచ్చి చదువుకొనువారలకు నెలకు జీతము రూ_ 5/- పోస్టల్ ట్యూషన్ వారికి రూ_ 1/-

వినయములకు,

పాపులర్ కెమిస్టు-

కె ఇ, యం, హాస్పిటల్ ఎదుట సికింద్రాబాద్

## భయంకరమైన కలరా

ఆయుర్వేద వైద్యసహాయము

తాండూరుకు యెనిమిదిమైళ్ళసమీపమునగల కోతలాపురమున యెల్లమ్మ జాతరలో ప్రతిసంవత్సరమువలె యీసంవత్సరము మూడవవారమునకుపది వేలజనము పాల్గొనియుండిరి, అందులోపాల్గొనినవారిలో కలరాచే సుమారు రెండువేల్ప్రజలు మరణమొందిరి.

తాండూరునందుగల ధనికులలో శ్రీ కల్యాణమాణిక్యం రాజయ్యగారు వెంటనే హైదరాబాదుకువెళ్ళి సుప్రసిద్ధవైద్యులగు శ్రీ వైద్యభూషణ హాకీం డి. జనార్దనము గారితో తెలియపరచగనే వెంటనేవారు తమవాసుదేవదకన్ ఆయుర్వేద ఫార్మశీనుండి అనుభవజ్ఞులగు శ్రీహాకీం బి. మార్కండేయులు శ్రీ హాకీం శ్రీరాములు మరియు శ్రీగంగాధరరావుగార్లను అమూల్య ఔషధము లనిచ్చిపంపిరి. వ్యాధిచేపీడితులైన ౩౫౭౫జనులను అహోరాత్రులు వ్యాధిగ్రస్థులకు చికిత్ససలిపి ఆరోగ్యవంతులనుగా జేసిరి. నూటికి ౭౦ వంతునకన్న నెక్కువప్రజలను రక్షించిరి ఈ రోగులు తాండూరు చుట్టుప్రక్కలగల (౧౮) గ్రామములకు జెందినవారు. వీరందరు శ్రీమాన్ వైద్యభూషణహాకీం డి. జనార్దనముగారికి వారివాసుదేవదకన్ ఆయుర్వేద ఫార్మశీకిని మరియు శ్రీవారిచేనియమింపబడిన వైద్యశేఖరులకు కృతజ్ఞతావందనములర్పించుచు, శ్రీవారికి ఆయురారోగ్యైశ్వర్యములనొసంగి కాపాడుగాకయని నిరంతరము భగవంతునిప్రార్థించుచున్నారు.

ప్రభుత్వమువారిచే నియమింపబడిన నిజాం ఆయుర్వేదదవాఖానవారున్నూ వీదప్రజలనుకాపాడుటకు ప్రతిపల్లెటూరిలో తనుఆయుర్వేదవైద్యనిపుణులనునియమించి, వీదలనుకష్టములనుండి కాపాడగలరని ప్రభుత్వమువారిని వినయపూర్వకముగా ప్రార్థించుచున్నారము-

తాండూరు మొదలగు

గ్రామములవారు_



అమాయకులగు బాలురను కష్టములనుండి రక్షించుటకు తల్లుల ప్రథమకర్తవ్యము

●

పిల్లల ఆరోగ్యబలములకు

ఇన్ఫాంటోన్‌ను జ్ఞప్తియందుంచుకొనుడు

దేశమునందు సుప్రసిద్ధమైన ప్రయోజనకారి

సీసా 1కి 15 అణాలు ప్రతిచోట దొరకును.

ఇన్ఫాంటోన్

మాన్యూఫ్యాక్చరింగ్ కంపెనీ, హైద్రాబాదు-దక్కన్

Khn&Sons

# కోతలాపురవిషాదగాధ

## సర్కారుఉపేక్ష-ప్రజలఅజ్ఞానము

### ఆంధ్రమహాసభాధ్యక్షుల విచారణ

ఆంధ్రమహాసభ కార్యకారిణీసంఘము చే నియమింపబడి కోతలాపురము తాండూరు మొదలగు ప్రదేశములయందు పర్యటనసలిపి ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీ రావినారాయణరెడ్డిగారు ఈ క్రిందిపత్రికా ప్రకటనగావించినారు.

రాష్ట్రీరాష్ట్రేతరపత్రికలలో ప్రచురింపబడిన సంఖ్యకంటే ప్రజలుఎక్కువగా కోతలాపురపు పరిసరగ్రామములయందు మరణించినారని, ఈమరణములకు కారణము కలరాజాడ్యము మాత్రమే కాని, వేరేకారణముచే మరణించినారనువార్తలు మతపాక్షికదృష్టితోను మతద్వేషములు పెంచుటకే గావింపబడినఅపోహలని, అనేకసంవత్సరములనుండిజరుగుచున్న ఈదేవీపూజకొరకై సమూహముగ వేలకొలదిప్రజలఆరోగ్యమును కాపాడుటయందు సర్కారుఅధికారులు అవలంబించిన గర్హింపదగినఉపేక్షయుమరియు తమ ఆరోగ్యమును కాపాడుకొనుటయందుప్రజలఅజ్ఞానము కోతలాపురపువిషాదఘట్టమునకు కారణమని నాఅభిప్రాయము.

కోతలాపురము అత్రాపుబల్దాజిల్లాలోని తాండూరు తాలూకాకుచెందిన ఒకచిన్నపల్లెటూరు. ఈగ్రామమునకు ఎల్లమ్మదేవాలయము సుమారు రెండుఫర్లాంగుల దూరమునున్నది. ఈదేవతాపూజ అనేకసంవత్సరములనుండి జరుగుచున్నది. పూజవిశేషముగ వైశాఖమాసమునకుచెందిన మొదటిశుక్రవారమునుండి ఆరంభమై క్రమముగా (౫)అయిదు శుక్రవారములయందుమాత్రమే జరుపబడు ఆచారముగలదు. మొదటిరెండు శుక్రవారములయందు ప్రజలు ఎక్కువసంఖ్యలో పూజలో పాల్గొనరు, మూడవ శుక్రవారము ప్రజలుఅత్యధికసంఖ్యలో పాల్గొనుఆచారముగలదు. గతసంవత్సరములలో ఈ మూడోశుక్రవారమున మూడునాలుగువేలప్రజలు వచ్చుచుండెడివారట.

ఈసంవత్సరము ఎప్పటివలెనే దేవీపూజ వైశాఖశు౹౹ం సరియగు ౧౧ తీరు ౧౩౫౦ ఫ తేదిశుక్రవారము ఆరంభమైనది. మొదటి రెండుశుక్రవారములుశాంతముగాగడచిపోయినవి. మూడో శుక్రవారము ౨౫తీరు ౧౩౫౦ ఫస్లీనాడు కొండంగలుతాలూకాకుచెందిన పోశెపల్లిజాతర ప్లేగుజాడ్యముచే ఆగిపోయినందున ఏడెనిమిదివేలవరకు ప్రజలువచ్చియుండిరి.

ఎల్లమ్మదేవాలయముప్రక్క ఒకకోనేరుకలదు. దీనికొలత ౧౫ గజములపొడుగు ౭ గజములవెడల్పు. దీనియందలి నీటిలోతు సుమారురెండుగజములు. వేరేనీటివసతి సమీపమున లేనికారణముచేతను ఈకోనేటినీటినే ఉపయోగించుటపుణ్యమని భావనయుండుటచేతను యాత్రికులు తమఅన్ని అవసరములకొరకై అనీటినేవాడుదురు. ఈ సంవత్సరముగూడ యిటులేజరిగినది. ప్రజలు గురువారము (౨౪తీరు౧౩౫౦ఫ) సాయంత్రమునుండియే ఈనీటినిఉపయోగించిరి. యాత్రికులలో కలరాజాడ్యము ప్రబలియున్న చించోలితాలూకాకుచెందిన "కోడ్లి" మొదలగుదూరప్రదేశముల నుండి వచ్చినవారుగూడయుండిరి. ఆకులు మొదలగునవిపడుటచే నీరుఅశుభ్రముగానుండును. అట్టి నీటియందు వేలకొలదిప్రజలు తమబట్టలుఉతుకుటచేతను మరియు స్నానాదికార్యములు చేయుటవలనను నీరుమరింతమురికైనది, ప్రజలు శనివారము ౨౬తీరు నుండిమరణించిరి, యాత్రికులేగాక ఇతరులనేకులుగూడ పరిసరప్రాంతములయందుండు సుమారు ౩౦-౪౦ గ్రామములలో మరణించిరి, ఎన్నిరోవంశములు నిర్మూలమైపోయినవి. ఎందరో బాలబాలికలుఅనాధులైనారు, మరణించినవారిసంఖ్య పత్రికలలో ప్రకటింపబడినదానికంటె హెచ్చుగానున్నదని నేనురూఢిగాచెప్పగలను, మరణించినవారికున్న చిహ్నములన్నియును కలరావ్యాధికి సంబంధించినవే. ప్రజలవలె పశువులుగూడా చచ్చినవనువార్తకు ఆధారము లేమియు నాకులభించలేదు. మొదలు కలరావ్యాధి కోనేటినీటిలోప్రవేశించినదనియు, అనీటిద్వారాప్రజలలో తీవ్రముగావ్యాపించి ఈవిషాదఘట్టమునకు కారణమైనదనియు, పైకారణము అమూలమునేనభిప్రాయపడుచున్నాను.

ఎంతయోకాలమునుండి ఈపూజ వేలసమూహముతోజరుగుచున్నప్పటికిని అధికారులు ప్రజలఆరోగ్యమును, కాపాడుటకై ఎట్టిపారిశుభ్రతఏర్పాట్లు (Sanitary arrangments) చేయుటను కర్తవ్యముగ నిర్వహింపలేదు. ఈసంవత్సరముగూడా కావింపబడలేదు.

వ్యాధిప్రబలిన నాలుగోరోజునుండి ప్రజలకుప్రభుత్వపక్షమున వైద్యసహాయములభించినది. హైద్రాబాదు, గుల్బర్గా, తాండూరు, ధరూరు మొదలగుప్రదేశములనుండి డాక్టర్లువచ్చి రోగులకువైద్యసహాయము ఇతరులకు టీకాలనువేసినారు. బొంబాయినుండి కొందరుఆర్యసామాజికులు మరియునితరులు వ్యాధిప్రబలిన సుమారు పంద్రెండుదినములతరువాతవచ్చి ప్రజలకువైద్యసహాయము యితరసౌకర్యములు కలుగజేసినారు. ప్రస్తుతము వ్యాధియిచ్చట అంతరించినదనియేచెప్పవచ్చును. కొన్నిదూరపుగ్రామములయందు ప్రబలుచున్నదని కొన్నివార్తలవలన తెలియుచున్నది

ఈవిషాదగాధనుండి ప్రభుత్వమువారు గుణపాఠమును నేర్చుకొని ప్రజలఎడ తమకర్తవ్యమును నెరవేర్చవలయును-ఇట్టిసమూహములయందు ఆరోగ్యరక్షణకై తగుఏర్పాటుచేయుట ప్రభుత్వవిధియని నేనుతలచుచున్నాను- ప్రజలుగూడాయిట్టివిషాదసంఘటననుండి పాఠమునేర్చుకొని తమకర్తవ్యమునుగుర్తెరింగిప్రవర్తించుటశ్రేయస్కరము, తమమూఢనమ్మకముల పరిణామములిప్పుడైనా గుర్తించి మునుముందు ఇటువంటిసంఘటనలకు తావొసంగకుండుటకై హెచ్చరించుచున్నాను-

రావి నారాయణరెడ్డి
౨౦-౮-౧౩౫౦

## మానుకోట రథమునకు యిబ్బంది

ఈగ్రామమున శ్రీ వేణుగోపాలస్వామికి రథము చేయించు నిమిత్తం భక్తులనుండి ద్రవ్యం రు౧౩౦౦ సొయిలుసమకూరిచి రథమును పూర్తిగా తయ్యారుచేయించితిమి. రథమునకు యిల్లుఅవుసరంగాన ప్రథమమున ప్రభుత్వానుమతికై వినతిపత్రము 'దాఖలుచేసియుంటిని. అందాజా రెండుసంవత్సరంబులుకావచ్చెను-కాని దురదృష్టవశమున మాతాలూకా తహసీలుదారు అనుమతియిచ్చుటకు బదులు సదరురథముమీద ఎండకువేయబడెపందిరికూడా వేయకూడదని మాతోకరారునామావ్రాయించికొని యున్నారు. ఇంతలో అవ్వల్ తాలూక్దారుగారు యీగ్రామమునకు వచ్చియుండిరి. యీస్థితియావత్తు మనవి చేసుకొంటిమి. వారు కరుణామయులు. సుహృద్భావులు కావునవెంటనే మిసలుయుక్తం తహశీలుదారు గారినిపిలిపించి విచారించిరి. పైవారికితహశీలుదారుగారు కొంత వరకుసమర్ధించిరికాని శ్రీవారు తహశీలుదారుగారిసమర్ధన సరిగా లేదనియు యిట్టికరారువ్రాయించుకొనరాదనియు, యీమిసలును రెండుమూడురోజులలో తమవద్దికిపంపమనియుచెప్పియుండిరి-కాని మిసలుపంపలేదు. తిర్గీ అవ్వల్ తాలూక్దారుగారికి యీస్థితియావత్తు మనవిచేసుకొంటిని-అందుకువారు ఈవ్యవహారాన్ని తొందరగాపైకిపంపవలయునని హుకుంయిచ్చినారు. కాని తహశీలుదారువద్దికి యెన్నియో పర్యాయములు వెళ్లితిని. వృధాప్రయాసంతప్ప ఫలముగుపడుటలేదు. యికముందు పైఅధికారులుఅయినను సత్యముగుర్తెరిగి రథమునకుయింటికై నేనుహుకుంయిప్పించగలరని ప్రార్థింపుచున్నాను.

ఇట్లు
కోర్కొండ భట్టరు వేంకటరంగాచారి
మానుకోటతాలూకా వరంగల్ జిల్లా.

## స్త్రీ ఆత్మహత్య

శంకరంపేట, ౧౭-౮-౫౦ ఫ.

ఈగ్రామమున ఈ ౧౮-౮-౫౦ తేదిన ఉదయముపరికి నోకవిపరీతమైన అలజడియలుదేరెను, సత్తెమ్మయనునొకయువతి బావిలోపడి ఆత్మహత్యగావించుకొనినదనియు, అట్టిశవము, బావిలో నున్నటులకనుగొనబడెను...... పోలీసు మొహరీరు పంచనామాగావించెనుకాని నామమాత్రమైనపంచనామయేమో శవముపూడ్చిపెట్టబడెను. నాడేకొంతకాలమునకే స్త్రీహత్యగావించబడినదని కలకలముబయలుదేరెను. అప్పటికప్పుడేతో లిరోజునపరిశోధనకైయేతెంచిన పోలీసుమొహరీరుగారు ఈ స్త్రీనిబలాత్కారించెనని స్త్రీఅందులకిచ్చగించనందున యీపరిణామముకలిగినదనిన్నీ స్త్రీవారసులు పోలీసు మొహతిమీముగారివద్ద విజ్ఞప్తిద్వారా తెలుపుకొనగా వారుసర్కిలుఇన్స్పెక్టరుగారిని విచారణార్థమై పంపిరి. ౧౧-౮-౫౦ తేదిన పరిశోధనమొదలిడిరి. ఇంతలో డాక్టరుగారిచే (పోస్టుమార్టం) పరీక్ష చేయించబడెను- ఫలితమునాత్మహత్యకాదనితేలెను- పరిశోధన అపుడలయాయెను.

## అంతదూరంలేదు

హైద్రాబాదు ప్రభుత్వప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు.

కొన్నిపత్రికలలో అద్దం యంత్రాలయానికి హైద్రాబాదుప్రభుత్వంవారు ౨౦లక్షలు చందాయియ్యనున్నారని ప్రకటింపబడినది. అద్దాలుచేసే యంత్రాలయస్థాపనకు ప్రభుత్వమువారువీలైనంత అవకాశాలుకల్పింతురు. కాని పత్రికలలో వ్రాసినంతమేరకు సహాయము చేయుటకై ప్రభుత్వము వారింతవరకు నిశ్చయించలేదు.

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర ఆషాఢ శు॥ ౬

సోమవారము


# జర్మనీ రష్యా యుద్ధము.

జర్మనీవారు రష్యాపై యుద్ధము ప్రకటించుట ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచివేసింది. జర్మనీకి యిది వరలోనే చేతినిండుగా పనియుండినది. ప్రబలులైన యింగ్లీషువారితో యుద్ధము చేయుటసామాన్యముకాదు. జర్మనీవారు యూరోపులోని చిల్లరదేశాలను గుటుక్కున మ్రింగుతూవచ్చినను ఇంగ్లీషువారిని ఓడించజాలనివారై యున్నారు ఇంగ్లీషువారు దినదినము విజృంభించుచున్నారు. ఇట్టిసమయములో రష్యాపై యుద్ధానికి దిగుట జర్మనీవారి సాహసమన వలెను.

జర్మనీవారును రష్యావారును మిత్రులుగాఉండిరికదా! అంతలోవారి మిత్రత్వానికేమి భంగముకలిగెను? అని పలువురు ఆశ్చర్యపడవచ్చును. నిజంగా ఈమిత్రత్వము అతుకులనేస్తము: జర్మనీవారు తక్కిన దేశాలను జయించుటకు రష్యాతో సంధిచేసికొనియుండిరి. ఈ సంగతి రష్యాజర్మనీల ఉభయులకు అంతరంగికముగాగుర్తేయుండినది.రష్యావారు యుద్ధాదిలో ఇంగ్లీషు వారితో చేరియుంటే కొత్తకొత్తలో జర్మనీవారు తమ బలాన్ని పూర్తిగావినియోగించి ఆనాడే ధ్వంసం చేసెడివారు. ఇంగ్లీషువారు వారుండే భూగోళస్థితినిబట్టి పోలెండువారికెట్లు సహాయంచేయలేకపోయిరో అదే విధంగా రష్యావారికిని సహాయంచేయలేకుండెడివారు. ఇప్పటికినీఇంగ్లీషువారికి ఆ అవస్థతప్పింది కాదు. దీన్ని రష్యానియంతయగు స్టాలిను గ్రహించినాడు. అప్పట్లో జర్మనీతో స్నేహంచేసుకోవడమే మంచిదనుకొన్నాడు. దానిలో కొన్ని లాభాలుండినవి. జర్మనీయుద్ధములో ఓడిపోయెనా తనకునూలాభమే. లేదా యుద్ధములో అలసిపోయెనా అది స్నీలాభమే. గెలిచినను రష్యాపై దండెత్తే ధైర్యముండదు. గెలిచేవరకు కొన్నిసంవత్సరాలుపట్టును. అంతలోతనరష్యాసైన్యాలను మందుగుండు సామానులను విమానాలను, ట్యాంకులను, బాగాసిద్ధం చేసుకొని సర్వసన్నాహాలతో ప్రపంచాన్నే ఎదిరించే శక్తితోఉండగలదు. ఇన్ని అంచనాలు రష్యావారు తప్పకుండా వేసియుంటారు. అంతేకాని రష్యావారికి జర్మనీవారికి ఒకరిపై ఒకరికిప్రేమపూర్వం లేకుండెను. మధ్యనలేకుండెను. ఇప్పుడు లేనేలేదు.

అయితే ఉభయులకు స్నేహం కాగిదాలమీద కుదిరిందన్నమాటే కాని హృదయాల్లో అదిజోరబడలేదు. జర్మనీ చేతినిండుగా పనిఉండేకాలములో రష్యా యేమిచేసినా చెల్లుతుందనిన్ని జర్మనీకి ప్రతిఘటించే సాహసం ఉండదనిన్ని స్టాలిన్ బాగాగుర్తించినాడు. అందుచేత సందడిలో సమారాధన చేసుకొన్నట్లుగా పోలెండులో సగం భాగాన్ని జర్మనీగెలిచి... తర్వాత రష్యానెమ్మదిగా మిగతసగం ఆక్రమించుకొని ఇది నాదిఅన్నది. జర్మనీ బిక్కమొగం వేసుకొని సరేఅంటూ ఆసగంభాగం పంచియిచ్చి పోయింది. జర్మనీఫ్రాన్సుహద్దులోఎత్తులు వేయుచుండగా రష్యావారు లటేటియా. లిథుయేనియా. ఎస్టోనియా దేశాలను అమాంతంగామింగివేసి వారి ఓడరేవులలో, పట్టణాలలో,తమఓడలను విమానాశ్రయాలను స్థాపించుకొన్నారు. అంతటితో ఊరకొనలేదు. ఫిన్లెండుపై దండయాత్ర చేసినారు. సుమారుమూడు నెలలు యుద్ధంసాగింది. ఎట్లైతేనేమిదాన్నికూడా రష్యా సాధించుకొన్నది.

ఇక దక్షిణంలో జర్మనువారు ఎత్తులపై యెత్తులువేసి రుమేనియాను తమవశములోనికియుద్ధంచేయకుండాతీసుకొనేవరకు రష్యాఅటునుండిసిద్ధంగాహాజరైంది. పూర్వంనాదిగానుండిననా "బెసరేబియా" మండలాన్ని నాకిచ్చివేయి అనిరుమేనియాను బెదరించి ఆభాగాన్ని లాగుకొన్నది. జర్మనీ నోటవేలుపెట్టుకొని చూస్తూఉండింది. ఇంకొకదిక్కు జర్మనీ యుగోస్లావియాపైయుద్ధంప్రకటించుచుండగానే అదేసమయంలో రష్యా యుగోస్లావియాతో స్నేహసంధి చేసుకొన్నది. హంగరీ యుగోస్లావియాలో ఒకమండలాన్ని మింగివేసేవరకు రష్యాకుకోపంవచ్చింది. నామిత్రదేశంలో ఈ పనియెట్లాచేసినావు అని బెదరించింది. ఇరాఖులో రషీదలీ తిరుగుబాటు చేసినాడు. జర్మనువారిని సహాయంగాపిలిచినాడు. అంతట్లోనే రష్యా ఇరాఖుప్రభుత్వంతో సంధి చేసుకొన్నది. ఇవన్నీ దాగుడు మూతలుగా కనబడుతునే ఉన్నవి.

కొన్ని మాసాలక్రిందట జపాను మంత్రి రష్యాకువచ్చి దానితో సంధి చేసుకొని పోయెను. అప్పట్లో రష్యానియంత స్టాలిన్ స్వయంగాజపానుమంత్రిని సాగనం పేదానికి రైలువద్దకు వెళ్లెననిన్ని చాలాగౌరవించెననిన్ని తీరా జపానుమంత్రి వెళ్లిపొయ్యే అప్పుడు స్టాలిన్ అతన్ని గాఢాలింగనం చేసుకొనెననిన్ని పత్రికలలో చదివినాము. అకాండంగా ఇంతప్రేమ యెందుకు పొటమరించుకొని వచ్చెనోకదా అని అనుకొన్నారు ప్రపంచజనులు. దానిలోని అంతరార్థం ఇప్పుడు కనబడుతూఉన్నది. జర్మనీతో సంఘర్షణతప్పదు. అప్పుడు జపాను వెనుకనుండి దెబ్బతీయకుండా ఆలింగన ముద్రతో ఆనందింపజేసి పంపిఉంటాడు స్టాలిన్. అందుచేతనేజపానుకున్నూ జర్మనీకిన్ని పూర్వంనుండియే గొప్పస్నేహంఉన్నా ఇప్పుడు జపాను గోడ పిల్లి నాలకంలోఉన్నది. గెలిచేపక్షంనాదిఅనే స్వభావంజపానుది. ఇంకారెండు వారాల వరకు జపానువారి భావంబయటపడదు. ఎవ్వరు గెలిస్తే వారిపక్షంనాదిఅని తర్వాత వెనుకాముందు చూచుకొని మాటలతో సానుభూతిని ప్రకటించితే ఆశ్చర్యంలేదు.

ఇంకొకసంగతి. సుమారు రెండు మాసాలకుముందు రష్యావారు జర్మను పొలిమేరలోఉండు యుక్రేన్ ప్రాంతంలో తమసైన్యాలను కూర్చినారు. అప్పుడు జర్మనీ "మిత్రమా యిదేమిపని" అని అడిగిందనియు అందుపై "ఏమిన్నిలేదు పరమమిత్రమా! ఈ ప్రాంతంలో పైరుకు నీరులేకుండా అయింది. అందుచే మనుష్యులచేత నీరుపోయించుచున్నాను. అని స్టాలిన్ అన్నాడనీ ఒకవార్త వచ్చియుండెను. ఇరాఖులో రషీదలి తిరుగబడితే రష్యా ఇరాఖుసరిహద్దులలో సైన్యంనిలిపింది అన్నారు. అప్పుడు రష్యా ఏమైనా ద్రోహంచేసి ఇరాఖునో పర్షియానోమింగివేస్తుందేమోఅనిఅనుకొన్నారు. ఈరెండు విషయాలను జోడించిచూచితే అదంతా జర్మనీపైననే అని స్ఫురించగలదు. ఈ విధంగా జర్మనీవారు ఒకరిపై ఒకరు విశ్వాసం లేనివారై యుద్ధానికి సంసిద్ధులౌతూనె వచ్చినట్లు దాఖలాలు కనబడుతూ ఉన్నవి.

మరొక విషయంకూడా పాఠకులు జ్ఞాపకం చేసుకోవలెను. సుమారు ఒకనెలక్రిందట స్టాలిన్ తన విదేశాంగ మంత్రియగు మొలటోఫ్‌ను ఆ పదవి నుండి తొలగించి ఆ రాజ్యాంగ శాఖకు తానే మంత్రత్వము వహించి నాడని వార్తలువచ్చెను. ఇదికూడా జర్మనీకి రష్యాకును సమీపించుచున్నయుద్ధాన్నే సూచించుచున్నది.

స్టాలిన్ నోరు తెరువని నియంత. హిట్లరు చెడవాగేనియంత. ఇద్దరిసిద్ధాంతాలు తప్పుడుసిద్ధాంతాలే. ఇంగ్లాండు ప్రధానమంత్రిగారగు చర్చిలుకు, విదేశాంగమంత్రిగారగు ఏడనుకు కమ్యూన్ సిద్ధాంతమంటే ఒళ్లు మండుతుంది. మన పాలకుల కేదిపథ్యమో మనకును ఆదే పథ్యం. జర్మనునాజీసిద్ధాంతమునుచూస్తే అదికమ్యూనిస్టు సిద్ధాంతం కంటే అధ్వాన్నం. హిట్లరును నమ్మేవారు ప్రపంచంలోఎవరున్నూ లేరు.అతడు అందరినీ మోసంచేసినాడు. రేపు తుర్కీని కూడా మోసంచేస్తే ఆశ్చర్యంలేదు. హిట్లరుజయమంతా మోసంలోనే ఉన్నది. తాత్కాలికంగా మోసానికే విజయమున్నది- ఈసమయంలో ఇంగ్లీషువారు రష్యాయొక్క తప్పుడు సిద్ధాంతాలను ఒప్పుకోకొన్ననూ వారికి సహాయంచేయుటకై కటిబద్ధులైనందున వారిరాజనీతికి మెచ్చుకోవలెను. అమెరికాకూడారష్యాకు బాగాసహాయం చేస్తానన్నది. మన పరిపాలకుల ప్రయత్నాలు సఫలవంతమగు గాక భారతీయులును యథాశక్తి అదితృణమైనను పణమైనను సరే తోడ్పడుట చాలా అవసరం. నాజీలను ఈసమయంలో వినాశనంచేయకుంటే వారు ప్రపంచానికంతకును కంటకులగుదురనుటలో సందేహంలేదు.

---

## ప్లేగుపమిన్ని లేదు.

౧౮ తారీఖు అంతమూవరకు హైదరాబాదు నగరములోను, చుట్టుపట్టులలోను ప్లేగుఏమిన్నిలేదు. ఒక్కకలరాకేసు మాయినది. అంటువ్యాధికి సర్టిఫికేటు ఇచ్చినది.

## పత్తిసుంకము

ప్రభుత్వమువారిట్లు తెలుపుచున్నారు. బొంబాయిలో ప్రత్తిధరక్రమంగా హెచ్చుచున్నది ఇపుడు౩-౧/౪ పల్లాఖండీపత్తిధరరు౨౭-౧౨-౦-కల్దారుఉన్నది. ఈలెక్కప్రకారం హైదరాబాదులోపల్లా రు౩౩-౭-౦ హాలీలధరఅగుచున్నది. అందుచేతఇదివరలోఉండిన రేటు కరోడిగిరిసుంకమునకుమారుగ ౧౫వతేదునుంచి నుండి ప్రతి పల్లాపై మూడున్నరరూపాయిలు సుంకముతీసుకొబడును.

---

# ఆంధ్ర యువతిమండలి

## సన్మానములు

ఆంధ్రయువతీమండలి పక్షమున హైద్రాబాదు రెడ్డిహాస్టలులో ౨౧జూనుశనివారము అభినందనసభజరిగింది. శ్రీలక్ష్మీదేవి పాపన్నపేట రాణిగారు అధ్యక్షతవహించినారు.శ్రీపాపన్నపేట రాణీగారు మండలిచేయుచున్న సేవనుప్రశంసించి, చిలుకూరుతీర్మానములు చాలాఅవసరమైనవనివిద్యావైద్యములకు సంబంధించిన తీర్మానములు ప్రభుత్వమువారు వెంటనేమనసుకుతీసుకొని ఆచరణలోపెట్టవలెననీకోరినారు. శరణాలయము. మహిళాసంఘములు అస్పృశ్యతపొందలగునవి వెంటనే ఆచరణలోనికితెచ్చుటకుశ్రీరంగమ్మగారు సభ్యురాండ్రుఅంతా పూనుకోవలెననిహెచ్చరించి మండలిభవననిర్మాణమును వెంటనే తలపెట్టవలెనని ఉపన్యసించినారు.

బి, అనంతలక్ష్మీదేవి గారు రంగమ్మగారిని ప్రశంసించి అభినందనపత్రము చదివి పూలహారాలతోసత్కరించినారు. రంగమ్మగారు సమాధానముచెప్పుతూ మనరాష్ట్రంలో మహిళోద్యమం చాలావెనుకబడివున్నదని ఎటుచూచినా స్త్రీలలోదరిద్రమూ దైన్యమూ, అనారోగ్యమూ వ్యాపించియున్నవనీ, మాటలతోకాకుండా పనిచేయవంతనఇష్టమనీ అందరూ తనకు తోడ్పడవలెననీ కోరినారు, మహిళాసభవిశేషములను, అభివృద్ధిని గురించి మాణిక్యమ్మగారు మాట్లాడుతూ మహిళాసభ పదిఏళ్లచరిత్రలోనూ ఉద్యమముఅభివృద్ధి చెందినదనీ, చాలామంది పర్దా వదలిపెట్టినారనీ, జిల్లాలలోకూడా చాలామంది ఉపన్యాసకురాండ్రు తయారయినారనీ ఇంకాఎక్కువప్రచారము జరుగవలసియున్నదనీ మాట్లాడినారు. మహిళాసభలో ఆమోదింపబడ్డ తీర్మానములను గురించి సీతాకుమారి గారు విపులంగామాట్లాడి వాటిఅవసరములను చెప్పినారు.

తరువాత గోఖలేస్కాలరుకుమారి ఇందూరాజారుకరునకును. హట్నుస్కాలరు వేలూరివసంతాదేవికినీ అభినందనపత్రములుఇచ్చినారు. స్టాన్లీ పాఠశాలప్రిన్సిపాలుగారైన శ్రీమతి డిలైమాషి హెచ్.డి.గారు, విద్యార్థినులు చిన్నతనంనుంచీ చాలాచురుకైనవారనీ వసంత రెండుపర్యాయములు డబల్ప్రమోషనులు చేయబడ్డదనీ ఈసంవత్సరము తెలుగులోరాష్ట్రముప్రథమురాలుగావచ్చి మొత్తములో రెండవస్థానములో వచ్చినదనీచెప్పి మండలి ఇలాటి ప్రోత్సాహకసభలను చేయుచున్నందుకు సంతోషించినారు. ఇందూరాజోరుకరు తనకుఈసన్మానముచేసినందుకుహిందీలో కృతజ్ఞతచూపుచూ ఈవిజయము తన పాఠశాలదేకాని తనదికాదనిచెపుతూ, ఆంధ్రయువతీమండలివారు తన్నుకూడాసన్మానించినందుకు సంతోషము తెలిపినది. సీతాకుమారిగారు వసంతనుగురించి చెప్పుతూ ఆమె చిన్నతనంనుంచీ మండలిలో చాలాప్రముఖ పాత్ర తీసుకొనుచుండెననీ ఆమె ఇంగ్లీషులో. తెలుగులో, సంగీతములో ఎన్నో డిబేటింగులలో ప్రథమబహుమానములను సంపాదించినదనీ, మండలిలో అనేక నాటకములు ప్రదర్శించి బహుమతులు పొందెననీ వారికుటుంబమంతా దేశసేవ భాషాసేవ సంఘసంస్కారము చేయుటలో ఆరితేరినవారనియు ఉపన్యసించినారు-వసంతాదేవి సమాధానంచెబుతూ "డిలైమాగారు బాగాబోధించినందువల్ల తామువిజయమందగలిగినామేకాని తనగొప్పఏమీలేదనీ మండలివారుమొదటినుంచి విద్యార్థినులకు ఎక్కువప్రోత్సాహమునిచ్చుచున్నారనీ చెప్పుచూ మన స్త్రీవిద్యలోనిఅవసరముగురించి ఉపన్యసించినారు. బాలికాపాఠశాలవిద్యార్థినులు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి "పురాణశ్రవణంఅనే ప్రహసనముప్రదర్శించారు- ఒకబాలికకర్రసాము చూపింది-ఒకబాలిక ముఖముమీద వెలుగుతున్న నీరాంజనమునుంచుకొని మనోహరమైన నృత్యముచేసి చాలాఆనందంకలిగించింది. చివరకు సీతాకుమారిగారు కృతజ్ఞతలుచెప్పుతూ మండలికి భవనంలేకపోవడం చాలాఇబ్బందిగా నున్నదని ప్రస్తుతం నారాయణగూడెంలో స్థలము తీసుకున్నారనీ అక్కడభవననిర్మాణం త్వరలోనే జరుగబోవుచున్నదనీ దానికిరాష్ట్రవాసులంతా ఎక్కువసాయం చెయ్యవలెననీ విజ్ఞప్తి చేసినతరువాత మంగళంతో సభచాలింపబడ్డది.

---

## హామదినం

౨౭ అమర్దాదువారము సాయంత్రం ౫-౩౦గంటలనుండి మహారాజా కిషన్‌ప్రసాదుగారి జ్ఞాపకార్థము రేడియోద్వారా మంచివినోదాలేర్పాటుచేసినారు. ప్రధానమంత్రిగారు ప్రారంభోపన్యాసంచేయుదురు, హోష్‌బిల్గ్రామీ, తురాబ్యారుజంగు, ఫానీ,రోఫ్ మున్నగువారలు పద్యాలువినిపింతురు.

---

# హైదరాబాదు బజారు దరలు

తేది ౨౪-౯-౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము

ధరలన్నీ హాలీలే.

| బియ్యము | పల్లా ౧కి ధర | | | |
|---|---|---|---|---|
| | రూ | అ | పై | |
| కిచిడిసాంబల్లు | ౨౦ నుండి ౨౧ | | | |
| సంబల్లు | ౨౨ | ౦ | ౦ | |
| ఢిల్లీబోగాలు | ౨౨ | ౦ | ౦ | |
| రాంసాగరు | ౧౯ | ౭ | ౦ | |
| వాసక్రాం | ౧౭ | ౪ | ౦ | |
| ,, | ౨౧ | ౦ | ౦ | కొత్తవి |
| అర్కాటి | ౧౭ | ౦ | ౦ | కొత్తవి |
| ,, | ౨౧ | ౬ | ౦ | పాతవి |
| కోనామణి | ౧౮ | ౦ | ౦ | పాతవి |
| బుడుములు | ౧౫ | ౦ | ౦ | |
| దేశావరి | ౧౫ | ౦ | ౦ | |
| **గోధుమలు** | | | | |
| షర్బతి | ౧౭ నుండి ౨౦ వరకు | | | |
| బన్సీ | ౧౯ | ౭ | ౦ | |
| అప్కారీ | ౧౬ | ౭ | ౦ | |
| పోటిపారా | ౧౫ | ౦ | ౦ | |
| ఎఱ్ఱగోధుమలు | ౧౪ | ౭ | ౦ | |
| **జొన్నలు** | | | | |
| తెల్ల జొన్నలు | ౧౦ | ౦ | ౦ | |
| పచ్చజొన్నలు | ౯ | ౭ | ౦ | |
| ముడిక జొన్నలు | ౮ | ౧౨ | ౦ | |
| సెనగలు | ౧౫ | ౪ | ౦ | |
| కందులు | ౭ | ౭ | ౦ | |
| మినుములు | ౧౦ | ౬ | ౦ | |
| అంకెలు | ౧౨ | ౭ | ౦ | |
| సజ్జలు | ౮ | ౭ | ౦ | |
| **పప్పులు** | | | | |
| సెనగ పప్పు | ౨౦ | ౦ | ౦ | |
| కంది ,, | ౧౫ | ౭ | ౦ | |
| సిరిసెనగ,, | ౧౯, ౨౦ | ౦ | ౦ | |
| లంక ,, | ౧౫ | ౪ | ౦ | |
| మినప ,, | ౧౮ | ౭ | ౦ | |
| పెసర , | ౧౭ | ౭ | ౦ | |
| బెల్లము | ౧౧ | ౦ | ౦ | |
| ఉప్పు | ౧౨ | ౧౩ | ౦ | |
| వుల్లిగడ్డ | ౧౨ | ౧౧౪ వరకు | | |
| తెల్లవరుగు | ౧౨ నుంచి ౨౦ వరకు | | | |
| చక్కెర మణుము [౪౦ సేర్లు] | | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ | |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ | |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ | |
| నిజామాబాదు ,, ,, | ౧౩ | ౧౨ | ౦ | |
| ఎఱ్ఱచక్కెర ,, పల్ల౧౩, | ౧౨ | ౭ | ౦ | |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౬ | ౧౨ | ౦ | |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే. | ౩ | ౧౨ | ౦ | |
| అల్లం ,, ,, | ౪ | ౦ | ౦ | |
| మణుము ౧౨ సే. | | | | |
| కొబ్బెరనూనె ,, | ౪ | ౭ | ౦ | |
| కుసుమనూనె ,, | ౩ | ౪ | ౦ | |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ | |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౭ | ౦ | |
| కిరోసిన్ (గ్యాస్) ,, డబ్బా ౧కి | | | | |
| **నెయ్యి** మణుము ౪౦ సేర్లు | | | | |
| బిదరు నెయ్యి ,, | ౪౨ | ౦ | ౦ | |
| తెలంగానా ,, | ౩౯ | ౦ | ౦ | |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ | ౨ | ౦ | |
| బంగారు తు॥ ౧కి | ౫౦ | ౪ | ౦ | |
| వెండి ౧౦౦ తు | ౮౨ | ౨ | ౦ | |
| ,, తు ౧కి | ౦ | ౧౧ | ౬ | |
| సవరన్ ౧కికల్దారు రూ- | ౨౭ | ౭ | ౦ | |
| **మారకం** | | | | |
| హాలీక కల్దార్లు | ౧౬ | ౮ | ౬ | |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౫ | ౬ | |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ | |
| వేరుసెనగ ,, | ౭ | ౪ | ౦ | |
| బుడ్డలు పల్లా ౧కి | ౭ | ౪ | ౦ | |
| పప్పు ,, | ౧౨ | ౦ | ౦ | |

గమనిక:-

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు,

## నిజాంగారిపేర ఖుత్బా చదువవలెను

రాయలసీమముసల్మానులకు హెచ్చరిక

మౌల్వీ బషీర్ అహ్మద్‌సిద్దీఖీ నిజామీగారు రాయచూరు ఇత్తెహాదుకార్యదర్శి గారిట్లు పత్రికా ప్రకటనచేసినారు.

కొన్నిరోజుల పూర్వము ఆదోనిలో నాతి ధ్యక్షతలో రాయలసీమ ముసల్మానులసభ జరిగియుండెను. అప్పుడు నిజాంగారి ఆసఫీజండాను ఎత్తియుండిరి. సత్యాగ్రహమైనకాలములో రాయలసీమనుండి సుమారు ౪ వేలముసల్మానులు ప్రతిఘటన సత్యాగ్రహముచేయుదుమని తెలిపియుండిరి. దీనినిబట్టి రాయలసీమముసల్మానులకు హు-ఘు-వ-నిజాం ప్రభువుగారిపై యెంతప్రేమయున్నదో వెల్లడియగుచున్నది. ఈసీమాముసల్మానులు ముస్లింలీగుయొక్కయు ఇత్తెహాదుల్ ముస్లిమీనా యొక్కయు బహద్దర్‌యార్జంగు బిగారియొక్కయు నాయకత్వములో తమపూర్వౌన్నత్యమును మరలపొందుటకై గట్టిప్రయత్నాలు చేయవలెను. కర్నూలు,కడప అనంతపురము బళ్లారి జిల్లాలలోని అన్నిముసల్మానులు ప్రతిశుక్రవారము ప్రతిమసీదులో మసీదులన్నింటిలో హు-ఘు-వ- నిజాంగారిపేర ఖుత్బాచదువుతూ రావలెను.

### అబ్దులజీజుమంత్రిగారి దౌరా బీదుజిల్లాలో

అబ్దులజీజుమంత్రిగారు బీదుజిల్లాలో దౌరా చేయుచు బీదుపట్టణములోని మసీదులను మందిరాలను పరీక్షించి శుక్రవారంనాడు బీదుమసీదులో నమాజుచేసిరి. మసీదులో అవసరమయిన కట్టడాలను సహాయంచేయించుమనిరి తర్వాత ౧౫ అమర్దాదునాడు కంకేశ్వర దేవాలయమును పరీక్షించిరి. ఈదేవళంవిషయంలో ముసల్మానులు ఆదిలము సంబంధించినదని మంత్రిగారితో చెప్పుకొనిరి. అహ్మదుషా బహమనీకాలములో యీదేవాలయముందుస్థానము ముస్లిములసమాధిస్థానముగా ఏర్పాటుచేయబడియుండెననియువాదించిరి. అయితేయీవివాదము ౧౩౦౫ఫసలీలో శ్రీ కన్వేరీకర్ జిల్లాతాలూక్దారుచేత "ఇది హిందువులమందిరమే"యని పరిష్కరింపబడియుండెను. అందుపై అబ్దులజీజుమంత్రిగారు పరిష్కారమయినవిషయములో ముసల్మానులిట్టికోరికలనుకోరుట సరియయినదికాదని హిందువుల కప్రచారము చేయకూడదనియు ముసల్మానులను మందలించిరి. తరువాత స్థానికవకీళ్లు మంత్రిగారికి అభినందనసభజరిపిరి

### మూడుసభలసంగము

మహారాష్ట్ర మహాసభవారు తీర్మానించినరీతిగా ఆంధ్రకర్ణాట మహారాష్ట్రమహాసభలు ఏకమై పనిచేసేటందులకు మీరుఒప్పుకొందురా అని మహారాష్ట్రమహాసభవారు ఆంధ్రకర్ణాటమహాసభాధ్యక్షులకువ్రాసినారట.

### విద్యార్థులను వెళ్ళగొట్టుట

హింగోలీలోని మాధ్యమిక పాఠశాలలో చదువు ౫ మందివిద్యార్థులను స్కూలునుండి వెళ్లగొట్టినారు.వీరిని నియమితకాలమువరకుఏసర్కారీ లేక ఖాస్గీబడిలోను చేర్చుకోగూడదని ఆజ్ఞాపించినారు. ఈబాలురు ఒకలిఖితమాసపత్రికను నడుపుకుంటూఉండిరట. అందుకొన్ని ఆక్షేపణీయమగు విషయాలువ్రాసినారట.

## ఇంగ్లీషువారి యుద్ధ వ్యయము

దినం ౨౦ కోట్ల రూపాయిలు!

౨౫ జూన్‌నాడు పార్లమెంటువారు యుద్ధంఖర్చుకు గాను ౧౦౦౦కోట్లపౌనుల అంగీకారమును ప్రసాదించినారు, ఈ మొత్తము మూడునెలలకు సరిపోతుందిఅని సర్ కింగ్‌స్లీవుడ్ గారుఅన్నారు. ఇప్పుడు ప్రతిదినము ఇంగ్లీషువారికిమాత్రమే యుద్ధానికిగాను ౧ కోటి ౨౫లక్షలపౌనులఖర్చుఅవుతూఉన్నది. ౧పౌనుకు ౧౩-౧౧-౦కల్దారురూపాయీలగును ఈలెక్కప్రకారం౧౬ కోట్ల కల్దారురూపాయీలగును,అనగాసుమారుగా ౨౦కోట్ల హాలీరూపాయీలగును.

## పాము మంత్రవేత్త

ఎవరికైనా పాముకరిచితే వారుఈవిధంగా కట్టిగాఅనుకొనవలెను.

"మహమ్మద్ అక్బర్ సాహెబుగారి ఆజ్ఞ ఉన్నది. పామువిషముదిగిపోవలసింది" అనిఅనవలెను, తర్వాతవారికి జాబువ్రాసి యీమత్తు సంగతి తెలుపవలెను లేదా టెలిఫోనులో వారికి కరిచినప్పుడుకాని తర్వాతకాని తెలుపవలెను లేదా టెలిగ్రాంఇయ్యవలెను.

వారిఅడ్రసుఇది-

మహమ్మదు అక్బర్ సాహెబు గారు
సిగ్నలర్. ఖాజీపేట స్టేషన్
యన్. యస్. ఆర్.

ఇదివరలో ఇతనిమంత్రం అమోఘంగాపనిజేసినదని అందరున్నూ ఒప్పుకొన్నారు

ఈసందర్భములో రాజాజీనాటి, మద్రాసు సండే టైమ్సుపత్రికలో ఒక సంగతిప్రకటింపబడినది గమనింపవలెను,

"కొంతకాలంక్రిందట ఒకస్త్రీకి పాముకరిచెను. ఆసుపత్రిలో ఇంజక్షన్ ఇచ్చిరి. అదిలాభంలేకపోయెను, ఆమెచనిపోతుందని ఊరికితీసుకొనిపోవుటకై సికింద్రాబాదుస్టేషనుకు తీసుకొనిపోయిరి. స్టేషనువారికి అక్బరుగారిసంగతి తెలుసుకాన అతనికి టెలిఫోను ఇచ్చిరి. అతడు ఆమెనుస్టేషనులో నేఉంచమని ఆజ్ఞయిచ్చెను. ఆమెచచ్చినదని ఆమెబంధువులుపూడ్చుటకు యత్నాలుచేసిరి. అంతలోనే ఆమెలేచికూర్చొనెను. ఇప్పుడు రైల్వేవారు మహమ్మదుఅక్బర్ గారిని ప్రజలసౌకర్యార్థమై ఖాయముగా ఖాజీపేటలోనే నియమించినారు—

సంవత్సరము చందా ౬ రూపాయిలు
ఆరుమాసాలకు ౩ రూపాయిలు
బ్రిటిషిండియా నుండి సం॥చందా ౭-౮-౦ కల్దారు,
పాతపత్రికలకు వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions
Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 16 | Hyderabad-Dn | Monday 30th June 1941 | Number 17

## కె. యం. మున్షీగారు.

### కాంగ్రెసును వదలుట

బొంబాయి అల్లరులు కారణమగుట

గుండాషాహీ అహింసకులొంగదు..

ఇదివరలో బొంబాయి మంత్రివర్గమందుండిన సుప్రసిద్ధరచయితలును కాంగ్రెసు నాయకులును అయిన కె.యం.మున్షీగారు కాంగ్రెసుసభ్యత్వమునుండి వదులుకొనిరి. బొంబాయిలో అల్లరులు కొన్నివారాలనుండి చెలరేగుచు నెవరెన్ని ప్రయత్నములుచేసినను తగ్గకుండా భయంకరరూపముదాల్చి జనులకు ప్రాణధనహానులనుకల్గించుచు వచ్చుచుండుటచేత మున్షీగారు చాలఆందోళనపడిరి. కొన్నిదినముల క్రిందట దుర్మార్గుల గుగుండాలను అణచివేయుటకు అహింసపనికిరాదని గుండాలకు అహింసనుబోధించుటకంటె సింహాలవద్ద భగవద్గీతాపారాయణముచేయుట మేలని వాకొకవ్యాసమువ్రాసి ప్రకటించియుండిరి. కాంగ్రెసువారు అహింసచేతనే ఉత్తముల బలిదానమును గుండాలకొంతికై చేయుటయుక్తమని బోధించినారు. కాని యిట్టివిధానముచేలా భమూలేదని మున్షీగారియభిప్రాయము. గుండాలను బలప్రయోగముచే ప్రతిఘటించుట ఆత్మరక్షణకర్తవ్యమని వారభిప్రాయపడిరి. మున్షీగారు మహాత్మాగాంధీగారితో నీవిషయము చర్చించి వారితో ఉత్తరప్రత్యుత్తరములు సాగించినారు. మున్షీగారుతమకు కాంగ్రెసుసభ్యత్వమునుండి తొలగియుండుట అత్మవంచనలేని సరియయినమార్గమనితలచి గాంధీగారికిజాబు వ్రాయుచు తమకాంగ్రె సభ్యత్వము వదలుకొనిరి.

ఈ విషయములో గాంధీగారియొక్కయు మున్షీగారియొక్కయు భావములు పత్రికలలో ప్రకటింపబడినవి.

గాంధీగారి ప్రకటన

గాంధీగారిట్లు పత్రికాప్రకటన చేసియున్నారు-

"మున్షీగారు నాకుఒక జాబువ్రాసిరి. తరువాత నాతో కలిసినారు, వారుఅహింసాసిద్ధాంతము ప్రకారము వర్తించుకొనుట చాలకష్టమని బొంబాయిలోని పరిస్థితులనుబట్టి అచ్చటిహిందువులకు అహింసయందు భక్తినికలిగింపజాలనని తెలిపినారు. బొంబాయిలోనిఅల్లరులు ఒకచిన్నయంతరకలహాయుద్ధములో తాను అహింసను ఉపయుక్తముగురీతిగ నుపయోగింపజాలమనిరి. అట్టిస్థితిలో కాంగ్రెసునువదులుకొనుట యుక్తమపద్ధతియని నేనువారికిచెప్పితిని. అహింసనాచరించువారు భావమందును చర్యలలోనుఅహింసాత్మురైయుండవలెను. కార్యములకుమూలము భావము, భావములేనిది కార్యముశూన్యము కావున భావములో ఉహింసలేకుండా భావములోని య హిం స క ను గు ణ ము గ నాచరణలేనివారు మున్షీగారివలెనే కాంగ్రెసును వదలుకొనవలెను కాంగ్రెసుఉద్యమము అహింసాసత్యములపై నాధారపడినట్టిది. ఈరెండునులేనివారికి కాంగ్రెసులోస్థానములేదు. సత్యమునకంటె అహింసఆచరణ సాధ్యముకానిదిగా కనపడును. ఎందుకనగా అసత్యమువ్యక్తముకాగు, హింసవ్యక్తమగుచుండును, నాసూచనప్రకారము మున్షీగారుకాంగ్రెసునువదులుకొనుచున్నారు. ఇంతకాలముసేవించినకాంగ్రెసునకు విశ్వాసఘాతము చేయకుండుటకై వారట్లు చేయుచున్నారు. వారట్లుచేయుటచేత అపోహలుపడకూడదు. వారింతవరకుసాధువుగానుండి యింకముందుభయంకరులైతనప్రతికక్షులపై పగసాధించువారనియు జాతీయతకు విరోధులైన యొకసాంప్రదాయకవర్గము వారనియు వారినిభావింపరాదు, హిందూదేశములోపుట్టిపెరిగినవారందరును వారిదృష్టిలో హిందూస్థానీయులయియున్నారు. వారుతొలగిందులకు వారిని నేనభినందించుచున్నాను. వారుతమసర్వశక్తులనువినియోగించి బొంబాయిలోస్థిరమయిన శాంతిని నెలకొల్పుదురుగాక!

మున్షీగారి ప్రకటన

"నేను గాంధీగారితో అనేకమిత్రులతోను దేశములోని యిప్పటి పరిస్థితులను గురించి చర్చించియున్నాను. ఆత్మరక్షణనుగురించి నాకు కలభావములనుబట్టి నేను కాంగ్రెసునందు సభ్యుడనుగా నుండజాలనను నభిప్రాయము కలిగినవాడనైతిని. దేశోభ్యుదయం కొఱకు నేను కాంగ్రెసుతో వేరుపడవలసిన అవసరంవచ్చినదని తలచుచున్నాను. దీనికిమారుగా మరేవిధానమవలంబించినను నాకుగాని, దేశానికిగాని కాంగ్రెసునకుగాని గౌరవముదక్కజాలదు- ఇప్పుడు కళ్ళయెదుట దేశంలో రక్తవాహినులు ప్రవహిస్తూఉండగా ఆప్రవాహాన్నికట్టుటకు ప్రయత్నంచేయకుండాఉండటం కర్తవ్యలోపమే అని తెలుపుతుంది. ప్రస్తుతంభారతదేశమునకు కటికచీకటిరోజులువచ్చినవి- ఆచీకట్లను పారద్రోలుటకుశ్రీభగవంతుడు నాకొకజ్ఞానజ్యోతినిప్రసాదించినాడని నేనుభావించుచున్నాను. భగవానుడిచ్చినతేజస్సునకుఫలితంగానాకర్తవ్యాన్ని నేను నెరవేర్చుకొనలేకపోయినట్లయితే నాదేశాని కిందుపాపనికినాలినవాడ నగుదునేమోయని యనుకొనుచున్నాను. కాంగ్రెసుయొక్క ముఖ్యసిద్ధాంతమునైన భావసంకోచముకలవాడనై యుందుపనిజేయుచుండిన గాంధీగారికిని యితరకాంగ్రెసునాయకులకును ద్రోహము చేసినవాడనగుదును.

మున్షీగారు గాంధీగారికి వ్రాసినజాబు

మీరు శ్రీభోగిలాలు లాలాగారికి వ్రాసినలేఖను నేను నిన్నఉదయం పత్రికలలో చదివినప్పటినుంచీ నామనస్సు చాలా కలతపడుతున్నది అందులో రెండుముఖ్యవాక్యాలను నేనుఉదహరిస్తాను. ౧ ఆత్మరక్షణకై దౌర్జన్యయుతంగా ప్రతిఘటించవలెనని అభిప్రాయపడుతున్న కాంగ్రెసువాదులు కాంగ్రెసునుండిబయటికివెడలిపోయి, తమకుతోచినవిధంగాప్రవర్తించి, అవిధంగా యితరులకుదారిచూపవలెను. ౨ హింసా యుతమైన ప్రతిఘటనలో శిక్షణమిస్తున్నట్టి సంస్థలతో (అఖాడాల) కాంగ్రెసువాది ప్రత్యక్షంగాకాని పరోక్షంగాకాని, సంబంధముంచుకొనకూడదు. ఈ షరతులకు నేనులోబడజాలనందుకు మీరునన్ను క్షమించగలరు.

పాకిస్థానము అహమ్మదాబాదు డాకా బొంబాయిమున్నగుప్రాంతాలలో ప్రత్యక్షమైనందున ఇట్టిఅల్లరులు ముందువృద్ధిబొందగలవు.

స్త్రీల మానానికీ, మాణానికీ, గృహానికీ, మతానికీ గూండాతనం భయపెట్టినప్పుడు, ఆత్మసంరక్షణకోసం ఏలాంటి ప్రతిఘటనఅయినా ప్రధానవిధిగా నేనుభావిస్తున్నాను. దౌర్జన్యయుతమైనప్రతిఘటనలో శిక్షణమిస్తున్నట్టి అఖాడాలుకూడా మీరుచేస్తారా! ఈరాష్ట్రంలో అఖాడాఉద్యమంతో నేనుగడచిన పదిహేను సంవత్సరాలనుండి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను, కూడా సంబంధంకలుపుకుంటున్నాను. ఈవ్యాయామాన్ని క్రమపద్ధతిమీదనడపడానికి బొంబాయిలోను, పూనాలోను, జరిగిన రెండు సమావేశాలకు నేను అధ్యక్షతవహించినాను. ఆత్మరక్షణలో మనజాతికి శిక్షణమివ్వడానికి ఈఅఖాడాలు అత్యావశ్యకమని నేనుభావిస్తునాను గడచినఅనేక సంవత్సరాలనుండి ఈఅఖాడాలు గుండాతనాన్ని ప్రతిఘటించడంలో మనప్రజలకుకొంత ఆత్మవిశ్వాసాన్ని పుట్టిస్తున్నవి. నేను ౧౯౩౦ లో నిమ్మక అనుకున్నపుటినుంచీ, నాకుమీరు ఒకరాజకీయనాయకుడుకంటె ఎక్కువవారుగా నేవున్నారు.

మాయావకత్తునటుంబానికీ మీరు తండ్రివలెవున్నారు. నాలోఏమాత్రపు ఆధ్యాత్మికజ్ఞానమయినాకలిగివుంటే, దానికిమీరుగడిచిన పదిసంవత్సరాలుగా మార్గం చూపుతున్నధ్రువతారవలెనున్నారు.

కాబట్టినామనస్సులోపడుతున్న ఈఆందోళనమంచి బయటికిదారికనిపించకుండా వున్నదని నేను మీకుచెప్పడానికి బాధపడుతున్నాను నామనసులోవున్న దానిని దాచుకుని, నేనుమీరుచెప్పిన దానిని అంగీకరించడంకాని, నేనుప్రాణతుల్యంగా భావిస్తున్న కాంగ్రెసుసభ్యత్వాన్ని,మీవిశ్వాసాన్ని పోగొట్టుకుంటూ నేనూ ఆభయంచేత మీఅభిప్రాయాలను బయటికిప్రకటిస్తూ నాదారిలో నేనునడుస్తూవుండడంగాని లేక ఏమీచెయ్యకుండాగాని వుండగలను.

ఆత్మరక్షణంకోసం దౌర్జన్యాన్ని ఏవిధంగానైనా ఎదుర్కొనవచ్చునని చెప్పకుండాగాని, సహాయంచేయకుండా, తగినసన్నాహం చేయకుండాకాని, అట్టివారితో ఏకీభవించకుండాగాని నేనుకట్టుబడిఉండలేను. ఇప్పుడుదేశానికే ముప్పువాటిల్లబోతున్నది. ఈసందర్భంలో నేనుఆత్మవంచనచేసుకోలేను. దేశాన్నిద్రోహంచేయదలచుకోలేను.

ఈసంధిగ్ధావస్థలో మీఉత్తేజనం, మార్గదర్శకంకూడా నాకుముఖ్యావసరముతే నాకర్తవ్యంఏమిటో తెలుపకోరుతాను.

ఇట్లు,
కె. యం. మున్షీ.

గాంధీగారి జవాబు

"నాప్రియమైన మున్షీ, నిర్మలహృదయంతో వ్రాసిననీజాబుచేరినది. దానిని ఇంగ్లీషులోవ్రాసినందుకు నాకేమిఆక్షేపణలేదు."

నీభావాలను అణిచివేసుకుని, నాఅభిప్రాయాలనే చిలుకపలుకులలాగ అనుసరించడం నేనుఎంతమాత్రంసహించను, అదిమనఇద్దరిలో ఎవరుగాని చేయవలసినపనికాదు అలోచనలో, అభిప్రాయనాచనలో నీకుసర్వస్వాతంత్ర్యంవున్నది. తప్పుఏదైనాజరిగితే మనందానినిసరిచేయవచ్చుకాని హింసతోకూడిన పద్ధతికంటె అహింసాయుక్తమైనపద్ధతేగొప్పదని మరవలేము- ఆచేయదార్థం అయితే, అహింసామార్గమును అవలంభించినవాడుహింసతోకూడిన మార్గములలోపోనవీలవునా? అహింసాసిద్ధాంతంలో నమ్మకలేనివారు హింసామార్గములనే పట్టవస్తుందని నేనిదివరకే చెప్పిఉన్నాను.

## ఆకాశంలో ౬ మైళ్ళఎత్తున విమానయుద్ధాలు

ఇదివరలో విమానాలు ౧౦౦౦౦ అడుగుల యెత్తువరకు గంటకు ౫౦ మైళ్లవేగంతో ఆకాశంలోపోతూఉండేవి. ఇప్పుడు జర్మనువారు ౩౫౦౦౦ అడుగులఎత్తునైన అనగా ౬ మైళ్లయెత్తులో ఆకాశంలో గంటకు ౩౦౦ మైళ్ళవేగంతో విమానాలునడిపించేప్రవీణతను పొందినారు. క్రిందినుండి విమానాలను తోపులతో పడగొట్టేయంత్రాలున్నవి. కాని అంతదూరం అయంత్రాలుకాల్చలేవు. అరుమైళ్ళయెత్తులో గాలితక్కువ మనకుండినగాలిలో మూడవభాగంగాలి మాత్రమేఉండును. అంటే మనిషిఆగాలిలో బ్రతుకలేడు. అందుచేత వైమానికులకు ప్రయాణికులకు ఆక్సిజన్ఆనేవాయువుతిత్తులుకట్టిపంపుతారు. ౬ మైళ్ళయెత్తులో మంచుగడ్డగా కట్టుకొనిపొయ్యే చావుచలిఉంటుంది అందుచేత దానికినీ తగినప్రతిక్రియ వెంటతీసుకొనిపోతారు, ఇందటమొదట ఇంగ్లీషువైమానికులకు ౩౫౦౦౦ అడుగులయెత్తున విమానాలనడిపేప్రవీణతలేకుండెను. వారున్నూ నేర్చుకొంటున్నారు.

## గోలకొండ డైరీ

౧౫ మెహరేవరువరకు అమ్మకానికిసిద్ధం
ఆలస్యంచేసి విచారపడకుడు
వెల ౧౪ అణాలు

## మతవర్గాలఐక్యత

### సర్ అక్బర్ గారి హితబోధ

రై. అ. సర్ అక్బర్ హైదరీగారు దేశీయసంస్థానములమంత్రి సభకుగాను బొంబాయికి గతవారంవెళ్లియుండిరి. అసభానంతరము వారుప్రకృతం దేశములోవ్యాపించిన హిందూముస్లింకలహాలను పురస్కరించుకొని తామువిచారమును తెలుపుచు ఈక్రిందివిధముగా పత్రికాప్రకటనముచేసినారు.

"యుద్ధముండనీ ఉండకపోనీ ప్రపంచములో మనమంచితనమును నిలబెట్టుకొనుట చాలా అవసరము బ్రిటిషిండియాలోను సంస్థానములలోను ఉండేప్రజానాయకులు వారేరాజకీయపక్షానికి చేరినవారైనను సరే వెంటనే వివిధమతవర్గాలలో సామరస్యము కుదిరించుటకై గట్టిప్రయత్నాలుచేయవలెను. కనిష్ఠం యుద్ధకాలంవరకైనా అధికార అనధికారముఖ్యులందరును ఈ కల్లోలములులేకుండునట్లుగా ప్రయత్నాలుచేయవలెను. ఇటీవల పంజాబులోను బిహారులోను హిందూముస్లింసంస్థలవారు ఉభయులను ఒకేసభావేదికపై సమిష్టిప్రచారముచేసిన ప్రశంసనీయమైనచర్య ఆదర్శముగానున్నది.

ఇప్పుడు నాజీదండగములు రష్యామీదుగా ప్రాకినవి. నిన్నటిమిత్రులు ఈనాడుశత్రులైనారు, ఒకప్రక్కయుద్ధంప్రకటించుతూ ఇంకొప్రక్క జర్మనువారు రష్యారాయబారిని ఆలింగనముచేసుకొన్నారు. ఇప్పుడు ఇండియాసరిహద్దుమీదికి యుద్ధము సమీపించుతూఉన్నది.
ఇటీవలఇంగ్లీషువారు సిరియాలో అబిసీనియాలో ఆఫ్రికాయితర భాగాలుపొందిన విజయాలు మనకుఉత్సాహజనకంగాఉన్నది. అమెరికావారిసహాయంచాలావిలువగలది. హిందూస్థానములోనిదేశసంస్థానములు అవిచిన్నవికాని పెద్దవికాని పూర్వమునుండి రాజభక్తికలవి- అవిచాలాఉదారంగా సహాయపడుచున్నవి. హిందూస్థానీ సంస్థానాలశక్తి దేశములోశాంతినినెలకొల్పియున్నది. ఇదికూడా యుద్ధసహాయంగా భావింపదగినదే

## నిజామాంధ్ర మహాసభ ఆంధ్రత్వము.

చిలుకూరు మహాసభలో శ్రీ జయంతిరామయ్యపంతులవారు మున్నగు ఆంధ్ర మహాపురుషులగూర్చిన సానుభూతితీర్మానమంగీకరింపబడకపోవుటయు, తర్వాత గోలకొండపత్రికలో సభాసిద్ధాంతములనుగూర్చి నాయకులును, సంపాదకులును తమయభిమతములప్రకటించుటయు జరిగినది. గోలకొండపత్రికా సంపాదకులు తమ యభిమానమును స్పష్టముగ వెల్లడించినందులకు మాదృశులకుఆంతుతీరినది. మా యాంధ్రనాయకులమీద సంపూర్ణమైనవిశ్వాస మూంచుకొనియును ఒకసత్యమునుగూర్చి యెట్లుప్రవర్తింపవలెనో ఈ సమస్య గుణపాఠము నేర్పినది.

మహాసభ యొక్క యుద్దేశ్యము తీవిధముగ నెన్నడుమారినో "నియమావళి" పుస్తకముతో తెలియజాలన్నది. రాజకీయత్వమునందును మితవాదిత్వము, లేక తీక్ష్ణవాదిత్వము, వారివారి వ్యక్తిత్వమునననుసరించియుండునని నేనుభావించుచున్నాను. తమపలుకుబడినుపయోగించి కొందరు నాయకులు మహాసభను తమరేఖలలోనడిపించెదరు. మొన్నటి చిలుకూరుతీర్మానమును ఇట్లేజరిగినది కాని సరియైనచర్చకాలేదు. అసలు ప్రస్తుత సమస్య ఆంధ్రుల గౌరవమునుగూర్చినదైయున్నది. జయంతి, గిడుగు, వ్యాపతిమున్నగు ఆంధ్రమహానాయకులు ౩౦,౩౫ సంవత్సరములు అవిచ్ఛిన్నముగ సర్వాంధ్రభూమి యభ్యుదయముకొరకై భాషాసమస్యవిధానరూపమున ఘనమైనసేవను సమర్పించినారు, వ్యాపతివారలో గొప్ప సమాజసేవకులు. కాంగ్రెస్సునపైతము నెత్తికెటరిగానుండిరి. వీరందరును ఆంధ్రత్వమును పురస్కరించుకొనియే సేవజేసినారుకాని అదియొక వ్యక్తిగతముగాకాదు. వైగా వీరేశలింగముగారితరువాయి వారినిబోలిన ఘనులు, ఇంతటివారిసేవ సర్వాంధ్రజాతికి చెందియున్నది. జాతీయము రాజకీయము నాదంద్వరే హా!అట్లగుచో ఆంధ్రమహాసభలో శ్రీఆంధ్రబాలబాలికలకు ఆంధ్రములో ప్రభుత్వమువారు చదువు నేర్పవలెననియు. ఆంధ్ర ప్రాంతము ఫలానాస్థలమువరకనియు, ఆంధ్రుల చిన్న కోట్లుతక్కఅనియు, ఆంధ్రులసంఖ్యనుబట్టి కౌన్సిళ్ళలోను, ఉద్యోగములలోను ఇన్నిస్థలములు లభింపవలెననియును" ఆందోళనలెందుకో గమనింపవలెను. జగదీశచంద్రబోసు మున్నగువారిని గూర్చి కాంగ్రెస్సులో సానుభూతి తీర్మానములు ఎచ్చినవా? రామజరవీంద్రుడు మున్నగువారిని గూర్చి కాంగ్రెస్సుకు గౌరవముకలదా! అనుసంగతిని మా నాయకులు విచారించినట్లు లేదు. కాంగ్రెసుకంటె మనసభ విలక్షణమైనదని వాదించుచో మరిచెప్పవలదిలేదు.

సర్వాంధ్రజాతికి సేవ జేసి, సర్వాంధ్రభూమిలోప్రసిద్ధినందినవారందరును, మనరాజకీయతత్త్వమునకుపోషకులేయనుట సయుక్తికము. ఏదోభావోద్రేకములో పొరపాటులుఅందరికినిజరుగుచుండును. అంతమాత్రముతో దానినేపట్టుకొనుచు మరలసమర్థించుటకు పూనుకొనక తమయభిప్రాయమును ఆంధ్రమహాపురుష సన్మానమునకు అనుకూలముగాప్రకటించి, ఈసమస్యను ఉపసంహరింపగోరుచున్నాను.

విధేయుడు
చిదిరెమఠము వీరభద్రశర్మ

### అంటుజాడ్యాలశాసనము

అంటుజాడ్యాలు అందుముఖ్యముగా క్షయతగిలినవారు వెంటనే వైద్యశాఖకు తెలుపవలెనియుండును. తెలుపకుండిన నేరమగును.అనుశాసనమొకటి హైద్రాబాదు ప్రభుత్వమువారుచేయనున్నారు.



Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn, Editor- S. Prathapa Reddy B. A.B.L